# మా స్వామి

( విశ్వేశ్వర శతకము )

విశ్వనాథ సత్యనారాయణ.

శ్రీ మంజూషిక, భక్తరక్షణకళా శ్రీచుంచు, వానంద వ
ల్లీ మంజు ప్రసవంబు, చిద్గగన ప్రాలేయాంశువున్, మోక్ష ల
క్ష్మీ మాణిక్య వినూత్న మేఖల కటాక్షీభూత నీహారరుక్
శ్రీమంతంబయి పొల్చు వెల్గు నొకఁడే సేవింతు విశ్వేశ్వరా!

కైలాసాచల సానువాసము, వృషస్కంధాగ్ర సంస్థాయి, త
త్ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతం,
బాలోలాగ్ర జటావనీఘటిత నాకౌకస్సరిత్కంబు, దే
హాలంకారిత లేలిహానము, నెలుం గర్చింతు విశ్వేశ్వరా

నీవే రాజువు నేను సత్కవిని దండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుఁడను దండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను గర్షకుఁడఁ దండ్రీ! నిన్నుఁ బండించెదన్
నా వైదగ్ధ్యము నీవ చూతు, కృప సంధానించు విశ్వేశ్వరా!

వాగ్నేతృత్వము వృత్తిరీతి రసభావౌచిత్య శయ్యార్థ సం
లగ్నోక్త్యంచితలక్షణధ్వని గుణాలంకారముల్ లేని నా
నగ్నోద్విగ్న కవిత్వ మెంచఁగఁ ద్రయీనాదంబో? ఓంకారమో?
భగ్నారిధ్వజ! వేదపుం గొసలొ నిన్ భాషింప? విశ్వేశ్వరా!

శ్రీవాణీగిరిజాధినాథుల జగత్స్థిత్యుద్భవాంతక్రియా
ప్రావీణ్యంబులఁ దత్తదాచరణభారం బూనఁగాఁ జేసి నా
నావిశ్వంబు ననంతగోళము లనంతాకాశ సంభ్రాంతముల్
నానిర్మాణ! త్వదాత్మనిసములుగాఁ గావింతు విశ్వేశ్వరా!

శ్రీనీహారనగాధరాత్మజసయా స్నిగ్ధాననాంభోజ ని
త్యానందైకపరుండు, గాంగఝురనిత్యస్నాత, రాకానిశా
నాథాంశశిరోవిభూషణుఁ డటంచున్ నిన్ను ధ్యానించు భ
క్తానీకంబుల పైపయిన్ గనుమా దాదా నీకు విశ్వేశ్వరా!

తలపైఁ జాబిలి నెమ్మిపించియము వేదశ్వానముల్ ముందు న
మ్ములు నమ్ముల్ ముమ్మొనవింటిబద్దయుఁ గరాంభోజాతయుగ్మంబునన్
మలరారన్ తనుతో బోయనారి వెను వెంటన్ రాఁగ మాయామృగ
మ్ముల వేఁటాడఁ బులిందరాజ నిను సంపూజింతు విశ్వేశ్వరా!

చలి మిన్నేటి కెలంకులందు సొగసుం జాబిల్లి పూదేక సం
దిలు సింగారము గా సమస్త చెవులన్ గంపింపఁగాఁ బాఁప పో
గులు మసన్ బులితోలు నై చికొని కొంగుల్ జారఁ బ్రేమంపుజూ
పుల సంధ్యాసతిఁ జూచు నీసొగసు మమ్మున్ బ్రోచు విశ్వేశ్వరా!

కరితోల్పుట్టముకొంగుతోఁ బునుకభిక్షాపాత్ర చేఁబూని సం
స్కారిణాం బిల చుక్కలేమి మై జడలు మూఁగన్ బొట్ట పెల్లాఁకటన్
సురుగన్ ముమ్మొనకర్రతోఁ దడుముకొంచున్ లచ్చిగేహంబు ముం
దర నిల్చున్ భవదీయభిక్షుకత కంతేం జెప్ప విశ్వేశ్వరా!

ఓ స్వామీ! అలకొండకోయెతకు నీ యొయ్యారమే బూదిపూఁ
తే సర్వాంబయి నీకు నా యమ సొబంగే నచ్చి కన్నాగు ర
య్యా! సంతానము, నేన్గుమో మొకఁడు వింతౌ నాగ్యాగలోక్షు డో
హో! సౌరాపద కాకరుం డొకఁడదేమో కాని విశ్వేశ్వరా!

నీవో యోగావసమూర్తి వేదు వసురాశీశంబు స్రుందించు ని
ష్ఠావైశద్యము పొల్చు నీ తనువు నీశా! అన్నపూర్ణాంబికా
దేవిం జూచిన వృద్ధవోలె మదికిన్ దీపించు దాంపత్య మీ
భావం బెన్నఁ డెఱుంగు శైలతనయా ప్రాణేశ! విశ్వేశ్వరా!

ఓ స్వామీ! అది యేమి పాపమొకదా యూహించి యూహించి నీ
తో సయ్యాటము లాడెడున్ గృహిణి యంచున్! ముగ్గొన్నె రింతు వీ
డ్కోసం బా నిగమార్థ్యమున్ దుఃనిషల్లోలాయుతాక్షీ హరి
హాస శ్రీఁ గను నీకు నత్కృత్రపకోహాసంబు విశ్వేశ్వరా!

అంతా వ్యర్థము పట్టి యాశ, పెనుమాయా పల్లి, వ్యర్థంబు నీ
మంతి స్వార్థము నీదుమూర్తి యొకఁడే మా తండ్రి! నిత్యంబు నా
కింతా తోఁచియు నీ మహార్ఘ మెవ్వఁడేని చూచి కాపేదు శా
మంత్ర కుట్మలవ త్సుధాకర శిరోమాణిక్య! విశ్వేశ్వరా!

దివ్యజ్యోతివి నీకుఁ బెల్లుబుకు భక్తిన్ జాటజూటాగ్ర చా
రువ్యాబద్ధ పవిత్ర దైవతధునీ! రుద్రాభిషేకం బొగిన్
నవ్య శ్రీ గతిఁ జేయఁగా నమకమైనన్ రామగా హృణా వా
క్కావ్యామోదము ముక్తిత్రో వెదుకుచుం బ్రక్కేపోవు విశ్వేశ్వరా!

నృత్తారంభంబునయందుఁ ద్వాధ్వనిత భేరిన్ బుట్టె శబ్దాగమం
బస్త్రార్థాగము ముద్భవించె భవదీయాంబాకృతిన్ వేదముల్
త్వచ్ఛ్వాసోద్భవముల్ శివా! యుపనిషత్త్వం బందె నీమేను వి
ద్యాత్మాకారముఁ బొందె నా కవిత కానా నిన్ను విశ్వేశ్వరా!

సంప్రార్థించెద నిన్ను మోక్షయువతీ సంఫుల్ల పీనస్తనా
గ్రప్రాంతాంకుర లేఖనాచతుర హస్తాంభోజ! ఓస్వామి! సా
యంత్రాశీస్సుల సంగీతంబునను బూర్వాహ్ణాపరాహ్ణంబులన్
సంకీర్తించెద నెప్డు జేదువు భవా! సర్వజ్ఞ! విశ్వేశ్వరా!

పాటింతున్ నిను సర్వదైవత శిరోభాగస్థ రత్నంబుగాఁ
బాటింతున్ సకలాఘముల్ సురధునీ పాథస్తరంగాగ్ర భా
గాటోప్ఫాలమంద మారుతతరంగాధూతముల్ గాఁగ, నై
శాటప్రాణ మరున్మహాభుజగవంశస్వామి! విశ్వేశ్వరా!

దిగ్వ్యోమాఖిల పూర్ణ! నీయెడల భక్తిన్ బొల్చి నీమూర్తి స
మ్యగ్వ్యాఖ్యానము చేసెం బో, అఘములేలా నిల్చునయ్యా! సుధా
రుగ్వ్యగ్రబద్ధ కిరీట! దైవతజగద్ధుర్య శ్రీప్రసూన ప్రభా
స్రగ్వ్యాప్తత్వములు నీ జటాలతలు, రక్షాదక్ష! విశ్వేశ్వరా!

అంహో వారణ కుంభ పాటన కళోద్యచ్ఛ్వేత భూభృద్దరీ
సింహస్వామి! భవత్ప్రగర్జనల దిక్సీమల్ ప్రతిధ్వానతా
రంహఃక్షేపము పొంది భీతిమెయిఁ దత్రత్యుల్ నిశాటుల్ 'నచా
హం హంతవ్య' యటంచు వ్రాలెదరు భార్యల్ కాళ్ళ, విశ్వేశ్వరా!

నీ వాదిత్యుల వెంటఁబెట్టుకొని తండ్రీ! దుష్టసంహార వే
ళావేశంబున శత్రుమూర్ధములయం దాఘాతముల్ సేయఁ గ్రో
ధావిష్టుల్ తమ రక్తమే యితర రక్తంబంచు దైత్యాధముల్
త్రావన్ జూతురు రాక్షసప్రకృతి యక్కారా! వింత! విశ్వేశ్వరా!

ఆధ్మాత ప్రమథాళి శంఖములఁ బెల్లై, సోమవీథి ప్రణీ
తేధ్మప్రోజ్జ్వల వహ్ని కారవము లెంతే దట్టమై, జాటవీ
థీ ధ్మాతామరవాస్తరంగ మయి, యింతే మొఱ్ఱ విన్పించదో!
క్రుధ్మంతుండవో? దోసముండిన యెడన్ రూపించు, విశ్వేశ్వరా!

సద్వ్యహాయస మార్గ చిత్పరిణ తాచ్ఛ జ్యోత్స్నకాకారి ని
త్యాద్వైతాఖిలలోకగర్భపరిపూర్ణానంద చంద్రుండవై
మద్వ్యాగ్లేశముచేతఁ గట్టువడి యీ మర్యాద పాటింతు నా
హృద్వేగోద్గత బాష్పముల్ గొనుము తండ్రీ! కాన్క, విశ్వేశ్వరా!

నీ విన్నాణము చిత్రమే మకుటరత్నీభూత జైవాతృకా!
గ్రైవేయీకృత కాద్రవేయ! గళరుద్రాక్ష భవద్బాడబా!
సేవాస్వీకృత భూతరాక్షస పిశాచీప్రేత! నేత్రప్రభా
శ్రీవిన్యస్త కృశాను! పార్వతమృగాక్షీదార! విశ్వేశ్వరా!

ముక్త్యధ్వంబుల నీపదాంకముల నంపల్ పూలఁ బూజింతు సం
సక్త్యాశాభయ లోభ మోహామద తృష్ణావల్లికల్ దెగింతు, ధీ
శక్త్యుత్సాహములన్ దమఃప్రకృతిలో సారింతు జ్యోతిర్లతల్
భక్త్యావేశ మొసంగితేని యొకఁ డప్పా! నాకు విశ్వేశ్వరా!

గండూషించిన నీట స్నాన మొసఁగంగా, సల్లకీ శాఖలన్
దుండాసన్ గొని తెచ్చి పూజలిడఁగా, దృత్యున్నతంబుల్ ఫణా
దండంబందునఁ దెచ్చి రత్నములు పాదద్వంద్వమున్ జేర్పఁగా,
నిండారన్ జెను భక్తి కబ్బెగతిఁ బొంగే రాదు విశ్వేశ్వరా !

స్వఃపూర్గోపుర శాతకుంభ శిఖర స్వచ్ఛప్రభల్, పాటిత్రై
నః పాండిత్య ధురంధరాఖిల సురానంతాధ్వ ఘూసచ్ఛటల్,
నిఃపర్యాప్తసుఖాలు కోరుటకుఁ బోనే పోదు నీ దివ్య స
ద్యః పారంగత చిన్మయాకృతి సదైక్యం బిమ్ము, విశ్వేశ్వరా!

అక్లీబద్వయమూర్తి! నీదు జట లయ్యా! బాలపత్త్రావళుల్
శుక్ల ద్వాదశి చంద్రఖండము జటాజూటిన్ బ్రసూనంబు, ని
త్యాక్లాంతంబును భస్మపుప్పొడి, మధుస్యందంబు ద్యోగంగ, నా
యీక్లేశంబు హరింప సారతరుమూర్తీ! చూడు, విశ్వేశ్వరా!

కంటే నీ పదముల్ త్రయీపరిణతాగ్ర్య శ్రీమహార్థస్ఫుర
ద్ఘంటామార్గము లల్పశాత్రవసతీ కంఠాగ్రసూత్రావళీ
లుంటాకంబులు మోక్షపట్టణ చరల్లోలాక్షి కాంచీరవ
ద్ఘంటానాదము లాశ్రితావనకళాత్తశ్రీలు విశ్వేశ్వరా!

నూత్నాంభోధరలక్ష్మి పోల్చి స్తనయిత్ను ప్రౌఢ జీమూతముల్
రత్నంబుల్ మెఱపించుకొన్నవి దిశల్ రంజిల్ల సౌదామనీ
పత్నీ దేహములందు నీ కరుణ యన్ భ్రాంతిన్ విలోకింతు నా
యత్నంబుల్ నినుఁబొందు నెప్పగిది నూహాతీత! విశ్వేశ్వరా !

సావిత్ర్యధ్వమునందుఁ గాంతిమయనక్షత్రింబుగా జ్ఞాన వి
ద్యావీథిన్ మిను కట్లుగాఁ బరిణత త్ర్యయ్యంత మార్గంబులన్
నీవేగా పొనరించు మ ట్లాడఁబడన్ నీకంత కష్టంబుగా
భావంబఁదునఁ దోఁచెనేని యది నా ప్రారబ్ధి, విశ్వేశ్వరా!

ద్యోస్స్రోతోఽంబులు దిఙ్మదేభకరసింధుశ్రీలు కల్పప్రసూ
నస్రగ్మాలలు శ్వేతహస్తికటదానంబుల్ త్వదభ్యర్చనా
ఘుస్రారంభములందు స్నానకుసుమాఘుశ్రీసుగంధార్థమై
త్రిస్రోతఃపతి! నేను నాకపతినా తెప్పింప? విశ్వేశ్వరా!

ఏలా యొక్కఁడు కొన్ని శబ్దముల కెల్లె సర్థముల్ నేర్చి శ
య్యాలంకార రసధ్వనుల్ తెలిసి కావ్యమ్ముల్ క్వచిత్కంబుఁగా
నాలోకించి తనంతపండితుఁడు లేఁడంచున్ విడంబించుఁ దం
డ్రీ! లీలామయమూర్తి! నిన్నెఱుఁగ లేనేలేఁడు విశ్వేశ్వరా!

పది పద్యంబులు వ్రాసి దీనిఁగయికో పైకంబు తే యంచుఁ దా
నిది సాగించె నెవండునేని యని యూహింపంగ నేలా యశ
స్సది వాంఛించెడు లోభిదాతవలెఁ గాఁడా? కాఁడు, ఔనా? యగున్
మది నీకెక్కినయేని నా తపము సంబాళించు విశ్వేశ్వరా!

అయ్యా! భక్తులపైని నీ కరుణ దివ్యాంభస్తరంగాలతో
ముద్యత్తై ప్రవహించుఁ గానియెడ శంభూ! దివ్యవారాణసీ
శయ్యానిద్రితు నిన్ను మేల్కొలిపి దీక్షన్ దెచ్చెమాతండ్రి తా
నియ్యామ్యావని నందమూరునకు నింకే గీతి? విశ్వేశ్వరా?

నిన్నున్ మజ్జనకుండు చూపి చనెఁ గానీ నిన్నుఁ బీడింపఁగా
నెన్నన్ గాస్త్రకుకూస్త్ర కిప్పటికి నీవే దక్క దిక్కొండు లే
దన్నా! మొన్నటిదాఁక మాన మది గర్వాధీనతన్ గాదు నీ
కన్నన్ వేఱొకయండయున్నదనియున్ గాదయ్య విశ్వేశ్వరా!

మా తాతల్ గడియించినాస్తి యొకయేమాత్రంబు మాతండ్రి పెన్
దాతృత్వంబున కాఁగ లేదు కవితా ధమ్మిల్ల కల్హార సు
శ్రీ తావుల్, తిరిపెంబురాయుఁడవు నీ సేవల్, ద్విధామార్గముల్
యాతాయాత నిరంతయాతనయు నాయాసంబు, విశ్వేశ్వరా!

తన హస్తంబునఁ బెల్లురేఁగిన మహాదాతృత్వ శౌర్యాగ్ని కిం
ధనమైపోయిన మమ్ముఁ బుత్రకుల మా దారిద్ర్యమున్ జూచి యీ
తని సేవింపుఁడటంచుఁ జెప్పి చనియెన్ మాతండ్రి, బంగారుకొం
డను జేఁదాల్చిన నిన్నుఁ జూపి, కనవా నా మాట? విశ్వేశ్వరా!

పునుకల్ చూచిన కాజగడ్డలు ఫణుల్ పొల్పారు కాజాకు లే
మనసౌ జాబిలి కాజపూ వెరువుపెల్లై సారమౌ దుబ్బుల
ల్లిన యుండల్ మెయి బూదిపూఁత తెలిఢిల్లీభోగముల్ చేను నీ
వనెదన్ మా పితృపాదు లమ్మని పొలం బౌ దీవు విశ్వేశ్వరా

మీ దాతృత్వమొ తండ్రి దాతృతయు మీమీమధ్యనున్నట్టి లా
వాదేవీలకు నాదు బాధ్యతకు సంబంధంబు లేదిట్లు రా!
ఏదో లెక్కలు తేల్చుకో! మొఱటుతో నేలా? యొడల్ మండెనా!
ఏదో వచ్చినకాడికమ్మెదను సుమ్మీ నిన్ను, విశ్వేశ్వరా!

ఉదితైణాంక మనోజ్ఞ మౌళితల శాణోల్లేఖ రత్నద్యుతీ !
అదియున్ బ్రహ్మకపాల నిర్గత సహస్రార ప్రభాపుంజమో !
అదియున్ రూపముపొంది నిశ్చలమునౌ నాహార్యకన్యాసుధా
స్పదరేఖాస్మిత మంజుభావమొ కృపాసర్వస్వ ! విశ్వేశ్వరా !

సర్వంబున్ బ్రతికూలమే యయిన యోజన్ దోఁచులోకంబు ని
త్యార్వాచీన భవచ్ఛ్రితావనకళా వ్యాసంగ పారీణతా
ఖర్వ శ్రీమధుమూర్తి దీనజనరక్షాకంకణ ధ్యానముల్
పర్వన్ దిక్కుల నేఁగుదేరఁగదె నన్ బాలింప విశ్వేశ్వరా !

కడు నాభాగ్యము సందెచీఁకటులుగాఁ గన్పించుఁ గన్పించవే
నడకల్వోయినఁ గంటకాధ్వములకే నన్నిడ్చు విద్యానిధిన్
జడుఁడట్టుల్ సుజనున్ దురాత్ముఁడటు ప్రజ్ఞావంతు సామర్థ్యహీ
నుఁడువోలెన్ గనిపింపఁ జేతు విది యెంతో వింత, విశ్వేశ్వరా!

నా సామీప్యమునందె రత్ననిధు లున్నట్లైను, జేసాచ నం
తా శూన్యం, బగు క్షీరవార్ధి వటపత్రంబందు నిద్రించు న
ట్లే సుప్తిన్ గలగందు, మేలుకొని నట్టేటన్ గనుల్ తేల్తు, నీ
యాశాహేమ కురంగ కృష్టుఁడను ముక్తాసుండ విశ్వేశ్వరా!

మాయాపద్ధతి చేతఁగాదు, పరసంపత్కైతవ ప్రక్రియో
పాయవ్యాప్తికి బుద్ధిపోదు, కృపణత్వం బొప్ప దుర్మార్గులం
దే యాచ్ఞామతి స్తోత్రపాఠము లొకింతేఁ జేయఁగాఁ జాలఁ దం
ద్రీ! యీ జీవితనౌక పట్టఁగల దో డ్డేరీతి విశ్వేశ్వరా!

అప్పా! లోకరహస్య మీ వెఱుఁగ వేనై నిన్నుఁ బీడించెదన్
దెప్పన్ జూచెద, రద్ది పెట్టెదను, నా త్రిప్పల్ పడన్ లేక నీ
వొప్పన్ బిల్తువు మధ్యవర్తులను, వారోస్వామి! హా! నీదియున్
దప్పే నందురు, కాన సంధి కెటులైనన్ రమ్ము విశ్వేశ్వరా!

అన్యాయం బనినంత భగ్గుమని దేహం బంతయున్ మండి కా
ఠిన్యంబున్ గొను నాదు వాక్కు శివ! తట్టీకల్ మహాకైతవో
పన్యాసంబులఁ జేయుచుందురు ఖలుల్ ప్రభ్రష్ట సన్మార్గు లే
మన్యుప్రక్రియ లోకవృత్తి నడచున్ మాయందు విశ్వేశ్వరా!

ఇల లజ్జాపరిహీణు లీ జనులు తండ్రీ! నీవు మర్యాద త్రో
వలు పాటించెదు నేత వీ జనులు చెప్పన్ మాంసభుక్తంబు విం
తల కోరల్ మిడిగుడ్లు లేని దితిసంతానంబు నీ వాసురా
ఖల ప్రాణానిల దందశూకమవు, ద్యోకేశాంత! విశ్వేశ్వరా!

ఈ తూష్ణీంకృతి యేల నీవు మఱి మా కే దైవమం చెంచుచున్
నీతోడన్ ముడిపెట్టుకొంటిని, భవానీభర్త లే నాకుఁ ద
ల్లీ తండ్రించును నమ్మితిన్ గరుణ పాలింపంగదే నాకు నే
లా తీవ్రాపద? యప్రతిష్ఠ పడనేలా మీకు? విశ్వేశ్వరా!

షో వింటన్ బదియారు వన్నె కనకంబో, నిల్చు నక్కొండఁ జం
దీవెండో, తనుభూషలన్ దలలపై దీపించు రత్నంబులో,
నీ వేదో యొకయింత యిచ్చినను గానీ చాలు దారిద్ర్యమే
ఘూవష్టంభము తీవ్రమారుతవహాఖతంబై పోవు, విశ్వేశ్వరా!

ధృతశీతాంశుకిరీట! నా బ్రదు కెడారింబోలెఁ గావింతువో?
అతినైరాశ్యము నిన్నువంటి సురసంఘారాధ్యుని పాదాంబుజ
ద్వితయారాధన శీలవంతులకు, నింతే తప్పదాయేని, యే
గతి కల్పింతు సతీకృతామరధునీకా! మాకు విశ్వేశ్వరా!

స్వామీ! నా బ్రదు కెండి నీ కరుణ వర్షాగాఢ జీమూత మా
లా మాధుర్యము లేది దుఃఖమయువేళా గ్రీష్మసూర్యాతపో
ష్ణామందత్వముచేత బీడువడి యంతా నెత్తురై యున్న దిం
కేమో సాగుకుఁ గుంభవృష్టిపడి కానీ రాదు, విశ్వేశ్వరా!

స్వామీ! యేలనయా బహూక్తులనినున్ బ్రార్థించుచున్నాను రెం
డేమాటల్ సిరు లిచ్చి వ్యర్థజనులందే సేవ చేయించ కె
ట్లో మాన్పింపుము, కాద యేని మృదుపాండు శ్రీనవచ్ఛాయలో
నీ మై దీధితిలోనఁ జేర్చుకొను తండ్రీ! నన్ను, విశ్వేశ్వరా!

నా స్వామీ! యిది యేమి న్యాయ మనెదన్ దారిద్ర్యమన్పేరిటన్
నా స్వాతంత్ర్యము నా మతిప్రతిభ నానామత్ప్రభావంబులున్
భాస్వన్మత్పిత్రురక్త గౌరవము కింభాగ్యంబుగాఁ జేతు నా
యీ స్వాంతాలయ నిత్యపూజలకు నీ కే లోటు విశ్వేశ్వరా!

ఈ నా భార్యయుఁ బిల్లలున్ బ్రదుకుత్రోవే దేనిఁజూపించు మం
తే నేఁడే చని యేగిరీంద్రములనో నిద్రింతు, నే వాగులం
దో నీరానెద, నే ఫలావళులలో తిందున్, బర్ణముల్ మేసెదన్
నీ నిష్ఠాగతి నీవుగాక మరి లేనే లేను విశ్వేశ్వరా!

నే నీ రోజున నేఁగి యే యడవులందే నాకులన్ దించు నె
ట్లో నిల్పన్ బ్రయతింతు దేహమటు కాదో చచ్చెదన్ లెమ్ము పో
కానీ యీ ఋణ మెట్లు తీర్చెదనో యీ కాసంతకై వచ్చి జ
న్మానేకంబులు దుఃఖినై తిరిగి పొందన్ జాల విశ్వేశ్వరా!

ఈ సంసారపయోధి లోఁ దెరుఁగ కిట్లే యీది నట్లే మన
స్త్రాసంబౌ మృతి యున్నదం చెఱిఁగియున్ దన్మార్గమే పట్టి న
ట్లే సామీ! యిది జీవిలక్షణము, నిన్నే సన్నుతింపంగలే
నే సంస్తోత్రము సేయఁబోదు జనుఁ డింతే సామి! విశ్వేశ్వరా!

తెలిపూఁబానుపులందు నో త్తిగిలి నిద్రింపన్, జగాలేత వె
న్నెలలోఁ జల్లని పిల్లగాలి పొరలో నెమ్మేను చేర్పన్ నెలం
తల లేనవ్వుల సోగబుగ్గ గిలిగింతల్ వెట్ట, నెంతెంత కో
ర్కులు నాకున్నవో, అంతనిన్నుఁగను కోర్కుల్ లేవు, విశ్వేశ్వరా!

మఱి రక్షించుట నన్ను నీకు బహుసామాన్యంబుగాఁ దోఁచునో
పురముల్ గాల్చుట కాదు, బ్రహ్మలిఖితంబున్ మార్చుటా కాదు, సం
సరణాంభోధి మహాపదద్రిధుత తృష్ణా వీచికల్లోలగ
హ్వారమౌ నాహృదయాన శాంతి నెలకొల్పన్ జూడు విశ్వేశ్వరా!

సాఁబాముల్ మసకాటలో విడఁచుఁ గూనా లాజడల్ ముళ్లలో
జీబుల్ గట్టిన మింటి క్రొత్తరఁగలో చిన్నారి జాబిల్లిగా
రాబంపున్ దనికించు వెన్నెలల దారా లల్లులో కీలు బొ
మ్మైన బందిన్ గొని నా తలంపు తెమలింపఁగ రాదె విశ్వేశ్వరా!

కులదైవం బనుచున్ దలార నిను మ్రొక్కుల్ మ్రొక్కుకొన్నాను లో
కులదైవంబువలెన్ ముభావమున నీకున్ జేఁత మేలయ్యా? నీ
తలపై వేలుపుబువ్వ క్రొత్తరఁగ మొత్తాలూరి ముయ్యేటి చెం
గలువల్ జార్చిన తేనె నా పయినిఁ జిల్కన్ రాదె విశ్వేశ్వరా!

నాకేమో మఱి నీవొసంగుదని రత్నాలున్ మహైశ్వర్యముల్
నీకేమో మఱి నేను బూదితనువున్ నిండారఁగాఁ బూసి భి
క్షాకుక్షింభరవృత్తిఁ బుత్తు ననుచున్ గాలంబు భిన్నాధ్వముల్
గా కేదోయొక మధ్యత్రోవఁజన నేలా రావు విశ్వేశ్వరా!

నాకుఁ జిన్నతనంబునుండి మదిలోనన్ దోచు వైరాగ్యమే
కాకీ సంసృతియొండు వెంటఁబడి యీ కాంతాసుతుల్ పేరిటన్
నా కాళ్లన్ బెనవైచుకొన్నయది కంఠానన్ దగుల్కొన్న దీ
శోకం బేగతి మాన్పెదో గిరిసుతాశుద్ధాంత! విశ్వేశ్వరా!

ఈ సంసారముచేత నిల్లాడలు గుల్లేకాని లేదేమి మి
థ్యాసౌఖ్యం బనిపించు దుఃఖమయ జన్మానేక మూహింపఁగా
సీసీ ఛీ యనుఁగాని వానిపయినే చిత్తంబు లగ్నంబగున్
భాసాభాసము నీదు చిన్మయప్రభావజ్యోతి విశ్వేశ్వరా!

నాకే పూర్వజనుర్మహాత్త్వముననో నా తండ్రి! నీ యీ పద
శ్రీకంజాతములన్ దగుల్కొనియెఁబో చిత్తంబు దానన్ ననున్
జేకో బాధ్యత నీకయున్నయది తూష్ణీంభావ మేలా ప్రభూ!
నా కుయ్యింతయు నీచెవిన్ జొఱద సంధ్యాదార! విశ్వేశ్వరా!

నేనున్ జేసిన పాపకర్మములు తండ్రీ ! చెప్పఁగా రానివిన్
లోసన్ దల్పఁగనైన రానివి దయాలోకాంబుధారాప్రవా
హానన్ క్షాళన చేసివైచెదవొ, లేదా రౌరవాగ్నిస్ఫులిం
గానీకంబుల నూరెదో పురువిషాణశ్రేణి! విశ్వేశ్వరా !

ఏనాఁడో శివ! దుఃఖసంసృతి మహాహీనాంబుధిన్ దాటి యెం
దో నే నొక్కఁడనే మహాగహనమందున్ నిల్చి నీ తేజమున్
బ్రాణాయామమునందుఁ జూచి 'శివ ! నిర్వాణైకమూర్తీ! నిరం
తానందైక మయస్వరూప' యనుచున్ ధ్యానింతు విశ్వేశ్వరా !

నే నీ లోకపు దాష్ట్యమున్ దెలిసి తండ్రీ ! పెన్ విరాగంబుతో
దీనిన్ వీడఁగనెంచు నా నిముసమందే భార్యగా సంతతిం
గా నా కాళ్ళను బంధముంచితివి పోఁగా నెంతుఁ బోనైన చోఁ
బ్రాణాల్ పోవును వీరి కీ మమతఁ గోయన్ జాల విశ్వేశ్వరా !

వ్యాఘ్రంబుల్ గలవంచు నాకు భయమేలా? అచ్చటన్ గోముఖ
వ్యాఘ్రంబుల్ బలె మోసపుచ్చవుగదా పైకెంతొ లోనంతయే
శీఘ్రం బచ్చోటికేఁగి తాపసుఁడనై చింతింప వాంఛింతు వ్యా
జిఘ్రున్మోక్షపథాశ మిక్కుటమయా చిత్తేశ ! విశ్వేశ్వరా !

నిను వీక్షించెద నంచుఁ బూఁజిలిడుదున్ నీకంచు లోనెంచుచున్
గనులన్ జోరున బాష్పముల్గురియుచున్ గాద్గద్యముల్ పొందుచున్
దనివోకే యెదలోని భావములు పద్యాలల్లి నాగుండెతోఁ
జని లోకంబును జూచి పుచ్చెదను నిశ్వాసాలు విశ్వేశ్వరా !

ఈ సాయంతన మేఁగుదెంతువని నే నే రోజు కా రోజు తం
డ్రీ! సర్వాశలు యత్నముల్ ఫలితముల్ నీ మీఁద నే పెట్టి యా
యాసం బొక్కఁడె నే మిగుల్చుకొని సర్వానేహమున్ బుత్తు నీ
వేసం బూర్జితచంద్రచూడ మెటులన్ వీక్షింతు విశ్వేశ్వరా!

స్వాంతంబున్ మృదుశయ్యపైఁ బఱచితిన్ భక్తిప్రథావస్త్ర మ
త్యంతంబుమ్ బయిఁ జల్లితిమ్ మృదుల భావాఖ్యప్రసూనాళి నా
యంతర్గేహము బాగుచేసితిని నీకై కంటిదారిమ్ బ్రతీ
క్షింతుమ్ వాసకసజ్జికమ్ బలె నుమాచిత్తేశ! విశ్వేశ్వరా!

నీ వేమో యరుదెంతువంచు మఱి నన్నే వచ్చి నా తండ్రి!'యీ
నీవా నన్నద నమ్మి కష్టముల నన్నేఁ బొందెదం చోర్పుగా
నేవో చెప్పెద వంచు నా మనసులో నేమేమొ యూహించి నీ
పై విశ్వాసము నుంచితిన్ వదల కప్పా! నన్ను విశ్వేశ్వరా!

ఆకర్ణించెద నేమిరో ప్రమథ శంఖారావమో! జాటవీ
థీకల్లోల తరంగ దేవతటినీ దీప్తారవంబో! కుభృ
చ్ఛ్రీకన్యామణి పాదనూపురమణిక్రేంకారమో! నన్నిదే
కైకో నీ వరుదెంతు వీ ధ్వని యదే కాఁబోలు! విశ్వేశ్వరా!

స్విద్యత్ఫాలము, స్పందితాధరనవశ్రీ సద్య ఉద్వేగ భా
స్వద్యోషార్ధము, చంచలద్భుజగరాజస్మంజుహారంబు, శ్లా
క్లద్యుత్యూర్జిత దీపితావయవ సమ్మానంబు, నీమూర్తి, భ
క్తాద్యుజ్జీవనరంహ మేమనుదు మద్భాగ్యంబు! విశ్వేశ్వరా!

నను రక్షింపఁగ నీవు వచ్చి తవులే నాతండ్రి! యీచంద్రికల్
తనుకన్, శ్రీనవగాంగవారి చినుకఁ, తారుణ్య రేఖా వినూ
తన సౌందర్యము పిల్ల తెమ్మెరలు చిందఁ, నన్ను నానంద వా
సన పొందఁ, మది నీదు రాక గురుతించఁ లేనె? విశ్వేశ్వరా!

దీర్ఘాధ్వమ్ము గమించి వచ్చి తడుగుల్ తే యొత్తెదన్, శీతలా
నర్ఘాంబుల్ చిలికింతు నంజలిపుటం బందిమ్ము, హేమంతప్రా
తర్ఘాసంబులు బిల్వపత్రములు మందారాది పుష్పాలు నీ
కర్ఘంబిచ్చెద, రమ్ము తీర్చెదఁబథాయాసంబు, విశ్వేశ్వరా!

నీకున్ నూడిద లిత్తు నా హృదయ తంత్రీయుక్తనూవల్లకీ
శ్రీకళ్యాణ మనోజ్ఞగీతములు తండ్రీ! వాని నేఁ బాడుచో
నా కన్నుల్ బడి వచ్చు బాష్పములు కంఠవ్యగ్ర గాద్గద్యముల్
మై కేడించిన లేఁత చెమ్మటలు, రోమాంచాలు, విశ్వేశ్వరా!

నీ కారుణ్యముకోసమై విధుర తంత్రీ వీణ వాయించు బా
లాకృత్యంబుగ నంగలార్చిన దినాలన్ నాదు జిహ్వాగ్ర వా
ణీకింక్ణంకిణి నూపురస్వనము లెంతే దట్టమై పోయె నేఁ
డీ కారుణ్యము చూచి నా కసలు నోరే రాదు, విశ్వేశ్వరా!

నీ కారుణ్యము సాటిచెప్పెదను గానీ నిక్కమూహింపఁగా
నీ కారుణ్యము సాటి దాని కదియే, నీ యీ కృపాలేశ మీ
నాకున్ దోచెను గించిదేతదుదితానందంబు దైనందిన
ప్రాకట్యంబును బొందఁజేసి నను సంరక్షించు, విశ్వేశ్వరా!

నీ కారుణ్యము సాటిసేయుదు హిమానీ వాఃకణాలోలమా
లాకేళీసలినాకగాచ్ఛజల వేలా కేలికాసక్త బా
లా కహ్లారకపోలఫాలరుచిజాల స్రస్తచేల స్ఫుర
త్ప్రాకారాకృతిమత్కుచద్వితయసంభారాలు విశ్వేశ్వరా!

నీకారుణ్యము సాటి తెత్తును భవానీ మోహనా కేకర
శ్రీకార శ్రవణాంబుజాత రుచిమత్స్మేరాననానందకు
ల్యాకల్యాణ తరంగవత్త్రివళి సంలగ్నాత్తసంధాన! వ
ర్షాకాలాంబుద సంస్రవజ్జలలవాచ్ఛశ్రీకి, విశ్వేశ్వరా!

నీ కారుణ్యము సాటిచెప్పెదఁ బికీ నిర్హ్రాదవేళాద్విరే
ఫైకోన్మాదిత సర్వతః పరివృత ప్రారంభగీతీ లస
న్మాకందాగ్రలతాంతపత్త్ర విగళన్మారంద కల్లోలినీ
వ్యాకీర్ణాంబుకణ ప్రసేక శిశిరత్వం బంమ విశ్వేశ్వరా!

నీ కారుణ్యము సాటి చూచెద వియన్నీలాతి నీలప్రభా
శ్రీకృన్మోహన వర్ణ భాద్రపదసంశ్లేష ప్రగర్జద్విలా
సైకాంభోద తనూ ప్రకాశిత వధూ సౌదామనీ దేహవ
ల్లీ కళ్యాణమనోజ్ఞదీధితి కరాళీ కేళి, విశ్వేశ్వరా!

నీవే మా కనిపించకుండినను గానీ యైనఁ గన్పించిన
ట్లే వేలూహాలుగాఁగఁ దెచ్చుకొని నీవే కాక లేఁడే కదా
దైవంబంచును నా కవిత్వము భవత్పాదద్వయిన్ జేర్చితిన్
రావే దీనికి నే ఫలం బొసఁగెదో రానిమ్ము, విశ్వేశ్వరా!

కుమతుండైన దురాత్ము పాపములు భక్తుండైన యవ్వానిక
ష్టములుం బండినఁగాని నీకు నది నచ్చఁబోదఁటట్లుండేఁబో
క్రమమేలా గయిపోవు చావొకటియేగా తక్కువా వెన్క న
ర్వము నొగ్గించితి వద్దిగూడఁ బ్రియమా? రానిమ్ము, విశ్వేశ్వరా!

భూమీదేవుల మానసంబు మృదువై పోల్పఁ వచస్సుల్ శిలా
సామాన్యంబులునై కనంబడెడిపో! జాల్ముల్ మనోభావమం
దేమో వహ్నులు పైకి వెన్నలు, జగంబీ రీతిగా సాగెడిఁ,
భూమీదేవుల దుష్టు లందురు జనముల్ చూడు విశ్వేశ్వరా!

పైకిఁ లోపల నెంతో యంత బహుధావ్యక్తంబుగా వీతమా
యాకారుల్ కుజనుల్,బహిస్సుధలు లోనగ్నుల్ మఱీ లోస్వయం
పాక శ్రీపరిపాకులే సుజను లవ్వా! యింత దుర్మార్గమీ
లోకం బింతకు నేను జాలను దయాళూ! పాహి! విశ్వేశ్వరా!

కవి శైవాంశమటందు రక్కతననే గాఁబోలు నిన్‌బోలె నన్
గవిసెన్ నిక్కముగా నమాయకత, నా కంఠంబుఁ గోయంగ నెం
చు విరోధిన్ సయితమ్ము నే నదుమఁగాఁజూడన్ మహాకోప మే
చు వడిన్ దగ్గును నిష్ఠ చాల దరులన్ జూర్ణింప, విశ్వేశ్వరా!

తేనెల్ వాఱును మేఘగర్జనలు వీతెంచున్ బికీకన్యకా
నూనవ్యాహృతి మాధుపంచమము చిందున్ ద్యోనదాంభఃకణ
శ్రీనృత్యంబులు సూపు నా కవిత తండ్రీ! నా హృదంభోజ మం
దానందచ్యుతి పొంది నీ శతక మిట్లైపోయె, విశ్వేశ్వరా!

నా భాగ్యంబిది యెట్టిదో శతకమైనన్ బూర్తి గాదే వ్యథా
క్షోభాకంపిత దేహయష్టి పులకాశ్రుస్వేద రూపంబుగాఁ
భ్రాభాతాంబుజ మట్లు నూత్నమధుహర్ష శ్రీధునీ వీచికా
క్షోభంబందెడుఁ దండ్రి! యింత కృపయా చూపింతు విశ్వేశ్వరా!

ఈ కించిత్కృతి యిట్టులైన మఱి యేమీ! లేదు లేవయ్య వే
ధా! కాపర్దశిఖాధునీ స్వనితగాథా! విశ్వనాథా! భవ
చ్ఛ్రీకంఠాభరణంబు చెప్పెదను రాజీవంబులోఁ దేనియల్
కైకోనే కయికోని క్రొత్తసిరి వాఁకల్ గట్ట విశ్వేశ్వరా!

తలపై జాబిలిరేక క్రొవ్వెలుఁగులోఁ దాత్పర్య మున్గొండ కూ
తులకున్ నాకు నిరాదృతి స్ఫుట తపో ధూఃక్లృప్తి సామాన్యమై
వెలసెఁ నాకును నమ్మువారికిని నీ ప్రేమం బొకేరీతి ని
మ్ములుగా భాగము పంచిపెట్టెదవు హోహో! స్వామి! విశ్వేశ్వరా!

మన సేమందును? దీనివక్రత లహో! మాన్పంగ నీవంటి చి
క్కని దైవంబు తలంపగా వలయునే కానీ మఱింకెట్లు మా
నును? స్వీయావిలపాపకార్యచరణాంధు ప్లుష్ట వాః ప్లావనం
బును బశ్చాత్తపనంబు నిత్యమయి యేమో ప్రాప్తి! విశ్వేశ్వరా!

గాటంబౌ తెలచిక్కన్ వెన్నెల శిరః కల్హారపుఁ దావి గా
నై టాటోటుగ సోడుముట్టెను వికృష్టాఘ్రాణ పర్యంత మా
ర్గాటోపంబుల లోచనేంద్రియ పథవ్యాపార లుంటాకమై
పాటో పోటో భవత్కృపాధునికిఁ జెప్పఁజాల, విశ్వేశ్వరా!

చెలువొప్పన్ సరసీజ బాంధవుఁడు వేంచేసెన్ వియద్వీథి చుం
గులపై నప్పుడు నిద్రలేచితినయా, కుక్షింభరిన్ దేవులా
టలతో వెళ్ళెను నాల్గుజాలు, నిశితోడన్ స్వేంద్రియజ్ఞానమున్
వెలితయ్యెన్ మఱియిద్ది యేమి బ్రదుకో వెళ్ళింతు? విశ్వేశ్వరా!

ఆక్రోశించెద బాహులెత్తి ప్రభువా! ఆలింపవే! యేమి కా
మ క్రోధంబు లహో! ప్రమాణతను సంపాదించె నాయందు, నీ
యక్రూరత్వము నీ వశిత్వమును నా యం దింత పొందింపవే!
అక్రీతుం డగు దాసుఁడన్ శివశివా యన్నాను, విశ్వేశ్వరా!

తేమలన్ జాలని పాటుగా నుసికొలందిన్ దూయఁజన్నట్టి బొం
గ్రమునా గాఢ చలత్పరిభ్రమణ రేఖన్ స్థైర్య మాభాసమై
యమరన్ జూచుచుఁ జూచుచుండఁ దల బల్వై తూలిపోనైన దే
హమునా నెన్నిగిరాట్లు నన్నిడెదో క్రీడాసక్త! విశ్వేశ్వరా!

మును లేనట్టిది లోభ మొక్కఁడు ననున్ బొందెన్ జరాక్రాంతియా
నని భీతావహమైనతో సుతునియందై మోహపుంబెల్లు, కా
మిని తొల్లింటిది నన్ బ్రశస్తపథగామిన్ జేయు దానిన్ దొలం
చిన మార్గానఁ దొలంచి నా విహపరశ్రేయస్సు, విశ్వేశ్వరా!

ప్రస్థానత్రయమున్ గనుంగొనుట తప్పన్ క్లిష్టకామావిలా
వస్థామార్గము నువ్వుగింజయినఁ దప్పన్ బోదు లోఁ గాలమే
ఘుస్థూలాకృతి నల్లనైన పొగయై కట్టెన్ వెలారెన్ మన
స్స్వస్థత్వం బని నేఁటి జన్మకె గడింపన్ లేనొ విశ్వేశ్వరా!

నినుఁ గ్రొంగ్రొత్తలు తేర్చుగుంఫనల వర్ణింపంగ నూహింతునా
నని యే దారినిఁబోయి పూర్వకవి పాదాంకంబులే తోఁచి లో
నన లజ్జాపరిగూఢ మానసుఁడనై నాలోన నేనే వినూ
తన శంకాహృదయుండ నౌదు, మఱి క్షుంతవ్యుండ, విశ్వేశ్వరా!

ఆనందైకమయస్వరూప! భవదీయైశ్వర్యముల్ ధూర్జటి
శ్రీనాథుల్ కవితాసతీ కుచతటీ శ్రీగంధ కస్తూరికా
స్థానంబుల్ బొనరించి రిప్పటికి నస్మత్ స్తోత్ర పాత్రంబవై
తేనెల్ ద్రావిన నోటికిన్ జలము లందింపయ్యో విశ్వేశ్వరా!

రచన ౧౯-౨౬

రసతరంగిణీ గ్రంథమాల, ౧౦. బందరు

విశ్వనాథ సత్యనారాయణ

